

# శ్రీకృష్ణశతకము.

గ్రంథకర్త

నరహరిగోపాలాచార్యులు,

హుజూరునగరుతాలూకా, తమ్మర, [నైజాం.]

పరిష్కర్త:

శతావధాని సంపన్ముడుంబ శింగరాచార్యులుగారు,

జగ్గయ్యపేట

మొదటికూర్పు 1000 ప్రతులు.

1933

శారదా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.





# శ్రీకృష్ణశతకము.

గ్రంథకర్త:
నరహరి గోపాలాచార్యులు,
హుజూరునగరు తాలూకా, తమ్మర, [నైజాం.]

పరిష్కర్త:
శతావధాని సంపన్ముడుంబ శింగరాచార్యులుగారు,
జగ్గయ్యపేట

మొదటికూర్పు 1000 ప్రతులు.

1933

సౌభాగ్య ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

శ్రీమతే విఖనసే నమః

క|| జనయిత్రి నరసమాంబిక
జనకుఁడు నరసింహగురుడు శాంతిపరులు ధ
ర్మ నిరూఢమతులు వినయ
మ్మున వారలఁ గొలుతు నిత్యము శ్రీకృష్ణా.

క|| అలఘుమతులు విద్యాగురు
వులు లంకావంశజలధి పూర్ణేందులు నా
ర్యులుఁ నగు నారాయణ శా
స్త్రులవారికి నా నమస్కృతులు శ్రీకృష్ణా

ఈ గ్రంథ ముద్రణమునకు ద్రవ్యసహాయ మొనరించిన యీ సజ్జనాగ్రణులకు శ్రీకృష్ణుఁడు సర్వశ్రేయోదాయి యగుఁగాక!

5-0-0 మ. రా. రా. రాజా నార్సరాజు వెంకట రాఘవ రావు వెంకటేశ్వరరావు జమీందారుగార్లు.

3-0-0 మ. రా. రా. కొమరగిరి గోపాల కిషనరావు దేశపాండ్యాగారు.

3-0-0 మ. రా. రా. కొమరగిరి పీతాంబరరావు దేశపాండ్యాగారు.

4-0-0 మ. రా. రా. నార్సరాజు రంగారావు దేశపాండ్యాగారు

3-0-0 మ. రా. రా. నార్సరాజు అనంత నరసింహారావు దేశపాండ్యాగారు.

8-0-0 కత్రిం చినకృష్ణా రెడ్డిగారు.

ఇట్లువిధేయుఁడు,

గ్రంథకర్త.

శ్రీ

శ్రీ కృష్ణాయ నమః



# శ్రీ కృష్ణ శతకము

క॥ శ్రీమత్కౌస్తుభమణి శో
భామానితవక్ష! బర్హి బర్హవిరాజ
ద్ధామాలక! దానార్ణవ
సోమా! సత్యాత్మ! నందసుత! శ్రీకృష్ణా! ౧

క॥ అండజవాహన! రిపువే
దండమహాసింహ! దుష్టదమన! మురారీ!
పండిత జనాభరణ! బ్ర
హ్మాండ మహామహిత తేజ! హరి! శ్రీకృష్ణా॥ ౨

క॥ శ్రీ కరుణాకర! పృథుద
ర్వీకరసుఖతల్ప! వినుత విషగళ! సుజనా
లోకిత నిజపదయుగ! సుగు
ణాకర! భక్తాభయప్రదా! శ్రీకృష్ణా॥ 3

క॥ కరధృత పంచాయుధ! మం
దరగిరిధర! శత్రులోక దళన ధురీణా!
హరిహయనుత సుచరిత! శ్రీ
వర! భక్తాభీష్ట! కేశవా! శ్రీకృష్ణా॥ ౪

క॥ కృష్ణా! శ్రితభయహర! ప్రభ
విష్ణూ! యాదవకులేంద్ర! వినుత దిగీశా!
జిష్ణూ! భక్తహృదార్తి హ
రిష్ణూ! కరుణా సుధార్ఝరీ! శ్రీకృష్ణా॥ ౫

క॥ కారణ కారణ! రిపు దు
ర్వార భుజవిలాస! శూరవంశపవిత్రా!
సూరిజనావన దక్ష! మ
హీరగుణా! సాధులోకహిత! శ్రీకృష్ణా॥ ౬

క॥ భీకర దైత్య హరణ! కరు
ణాకరసుకటాక్ష! నిస్తులానందమయా!
ప్రాకట యశోవిశాల! సు
ధాకర నిభవక్త్ర! చక్రధర! శ్రీకృష్ణా॥ ౭

క॥ కరిరాట్సన్నుత సుగుణా
భరణా! నిజభక్తలోక పాలన నిపుణా!
సరసీరుహనిభ చరణా!
శరదిందు నిభోచ్ఛకీర్తి చణ! శ్రీకృష్ణా॥ ౮

క॥ లోకానందప్రద సు
శ్లోక! మహావిమల! భక్తి సుందరసుజనా
లోకిత సజతేజా! వా
రాకరనిలయా! శ్రితార్తిహర శ్రీకృష్ణా॥ ౯

క॥ నరకాసుర భుజదర్ప వి
సరకాసన వీతిహోత్ర! సత్యచరిత్రా!
గిరికన్యకాకుట విరాజ
ద్వర రత్నరుచి ప్రకీర్ణపద! శ్రీకృష్ణా॥ ౧౦

క॥ సర్గస్థితి విలయ మహా
వర్గ సమున్నిద్రశౌర్యభద్ర! సుధీ సం
సర్గోన్నత జనపావన!
భర్గామరవినుత శూరవర శ్రీకృష్ణా॥ ౧౧

క॥ దిగధీశ నుతచరిత్రా
జగతీ భారాపహరణ సదమలరూపా
నిగమాంతవేద్య భాస్వ
త్సుగుణ వ్రజపూర్ణ నందసుత శ్రీకృష్ణా॥ ౧౨

క॥ శేషాధిపశయన లస
ద్భూషణ రిపుబాహుగర్వభేదన సతతా
శేషశుభావహ నిస్తుల!
భాషణ! సురదేవ! కేశవా! శ్రీకృష్ణా॥ ౧౩

క॥ అరుణాబ్జనేత్ర! దళితా
మరశాత్రవ! భక్తహృదయ మందిరసంస్థా
స్థిరకళ్యాణనిధాన! కు
ధరధారణధీర! సౌఖ్యదా! శ్రీకృష్ణా॥ ౧౪

క॥ అరయంగ సోమకరాక్షసు
డురువడి వేదంబుగొని మహోదధిడాగన్
పరమత్స్య దేహివై రిపు
హరియించితివీర! శత్రుహర! శ్రీకృష్ణా॥ ౧౫

క॥ సురలసురలబ్ధిఁ దరచఁగ
గిరి క్రుంగుచు వడిన నీవకిల్బిషమగు నా
దరమునఁ గూర్మాకృతి స
త్వరముగఁ గొని బ్రోచితివిగదా! శ్రీకృష్ణా॥ ౧౬

క॥ హాటకనేత్రుఁడు పృథివీ
పాటవమెడలించి ఘోరభంగిగవయు న
ప్పాటుఁదలచి కిటివై రిపు
దాటిఁ జెరచి బ్రోచితివిక దా శ్రీకృష్ణా॥ ౧౭

క॥ శరమురుదుగ నరహరి రూ
పరుడుగఁ గైకొని విరోధి నరసి నఖములం
బరిమార్చి భక్తరక్షణ
పరయుఁగఁ జేసితివి దుష్టహార శ్రీకృష్ణా॥ ౧౮

క॥ వటురూపముఁ గైకొనియు
ద్భట దానప్రథితుఁడైన బలిఁ జేరి శుభో
త్కటముగు దానముఁ గొని నాం
తట నీవేనిండితివిగదా శ్రీకృష్ణా॥ ౧౯

క॥ ధరణీ నాథులగర్వము
హరియింపఁగ పరశురాముఁడనఁ బుట్టి, సము
ద్ధురతఁ జంచి హరించితి
వరయుగ బ్రహ్మణ్యమూర్తివై శ్రీకృష్ణా॥ ౨౦

క॥ దశరథ తనయుఁడవై యా
దశముఖుఁ బరిమార్చి దివిజతతిగొల్వఁగ స
ద్యశము గడించితివో నా
వశమే? నినుంబొగడ శూర వర శ్రీకృష్ణా॥ ౨౧

క॥ బలరామ కృష్ణులనగా
నిల పైజన్మించి ధారుణీశులఁ గలహా
మ్ముల కును గొలిపి భూభారము
విలయముఁ జేసితివి సాక్షివిగ శ్రీకృష్ణా ౨౨

క॥ అపరాధపురులు ద్రుంగగ
నపురూపపు బుద్ధరూప, మమరార గతి
త్రపలంజేసి యువతులం
ద్రిపురాసురల న్వధించితివి శ్రీకృష్ణా॥ ౨౩

క॥ కలికాలమునందు మహా
కలుషంబులు పెరుగ, సత్యకలనారహితుల్
గలచో, ఖిల్లలను, సత్యవి
ధులఁ జేతువు కల్కిరూపుతో శ్రీకృష్ణా॥ ౨౪

క॥ నీరూపంబు లనంతము
లై రాజిల్లునుకదా మహామతులటు లే
నీరూపంబులఁ గొల్చి సు
హారూఢింజెందు వార్గదా శ్రీకృష్ణా॥ ౨౫

క॥ „రాధాకృష్ణా" యనిన న
రాధములేనియునుఁ బ్రేమమలరారి జగ
న్నాధు నొనరింతువట శ్రీ
రాధాతన్వీమనోహరా! శ్రీకృష్ణా॥ ౨౬

క॥ జగతీభారముఁ బాపగ
దగి యజ్ఞానాంధకార తపన ప్రతిమం
బగు నీవిచిత్రవర్తన
ముగునే వాక్రుచ్చ మాకు హరి! శ్రీకృష్ణా॥ ౨౭

క॥ బాలత్వంబున శైశవ
లీలన్ యువభావ వివిధలీలాచరితల్
వేలకు వేలుగ గలవే
లీలలని నుతింతు నీకలిన్ శ్రీకృష్ణా॥ ౨౮

క॥ అసమాన దేవకీ జఠ
రసరస్వచ్ఛశకిరణ రత్నంబై పెం
పెసగిన నీరూపము శుభ
మెసగగ నామదినినిల్పువిగా! శ్రీకృష్ణా॥ ౨౯

క॥ పూతనరక్కసి విష సం
ఘాతముగా జేసి కుచయుగ స్తన్యముఁ గ్రో
డాతతుడా నీకిచ్చి ము
హీ తలగతయయ్యె నప్పుడే శ్రీకృష్ణా॥ 30

క॥ ఒక్కటఁ దృణాసురుడు మది
గక్కసపడి గాడ్పురూపుగావచ్చి నినుం
జిక్కవరుచునెడ నెత్తురు
గ్రక్కించి వధించినావుగద శ్రీకృష్ణా॥ 3౧

క॥ శకటాసుర వరుడు న్న
మ్మికవాడై కంసునకు నమేయ దురాశో
త్సకుఁడై నింగదిసిన వా
నికి మృత్యువుఁదార్చి నావనిన్ శ్రీకృష్ణా॥ 3౨

క॥ శ్రీదేవకి గర్భమునం
దాదరముగ నీవుజొచ్చు టాదిగ కంసో
ర్వీదయితుడు సమ్మోదం
బే దగ ఖేదంబునొందడే? శ్రీకృష్ణా॥ 33

క॥ చిడిముడి పసులెన్నోనియుఁ
దడబడకయొనర్చి గొల్లతగ్గోపింపన్
సడిసేయక బయలంబను
గదుసుఁదనను నేర్చినావుగద శ్రీకృష్ణా॥ 34

క॥ ఆభీరసతులు గొందరు
నీభీతిఁగలంగినీదు నేర్పుయశోదా
సౌభాగ్యవతికిఁ జెప్పగ
నేభీతులుపొల్కి నుండెదే? శ్రీ కృష్ణా 35

క॥ ఎట్టెట్టురా? కృష్ణయ్యా
మట్టిని దింటివని నీదు మాతయడుగ చీ
పట్టిదని వక్త్రమున జగ
మట్టె కనుంగొనఁగజేసితౌ శ్రీకృష్ణా॥ 36

క॥ దధిఘటము నందభామిని
మధియింపఁగ రాతగొట్టి మాసితమగు నా
దధి వే జుర్రితివట చ
క్రధరా తెరవాటునాని గతి శ్రీకృష్ణా॥ 37

క॥ కొంటెతనముఁజేసితి వని
గంటువడుచు నాయశోద గంతులిడెడు నీ
వెంటఁబడి పట్టుకొని నను
మంటంబంధించెఁ గ్రుద్ధయై శ్రీకృష్ణా 38

క॥ యమళార్జున తరుశాపము
సమయింపఁగ రోటఁగూల్చి చయ్యనిజరూ
పములిచ్చి గాచినా వను
పమతేజా నిత్యసత్యపద శ్రీకృష్ణా॥ 39

క॥ బృందావనమునఁ గోపక
బృందముతో నీవు ధేనుబృందముఁగాయన్
వందురు బాసెను జనుల క
మందానందంబుమది నమర శ్రీకృష్ణా॥ ౮

క॥ వత్సాసురుఁడు బకాసురు
డుత్సాహముతోడ నిన్ను నొడుతుమనుచుఁ గ
వత్సముల గాసిఁజేసి ని
రుత్సాహత మిత్తిఁజేరి రొగి శ్రీకృష్ణా॥ ౮

క॥ లేగలగాయు చరణ్యము
లోగల కాసారతటిని లోలుఁడవగుచున్
బాగుగ జల్దిఁ గుడుచు నీ
యోగము జిత్రమనితలతు నో శ్రీకృష్ణా॥ ౮

క॥ చతురాస్యుఁడు గోగోపక
తతిదాచిన నెఱిఁగి సౌగస్యత వహించియధా
ప్రతిరూపంబులఁ దాల్చి వి
గతగర్వునొనర్చినావు గద శ్రీకృష్ణా ౬

క॥ కాళీయు ఫణిఫణమ్ముల
మాలిమి పట్టాల తాళమానంబులతో
గ్రాలినని పాదములే
వేళనునా మదిని నిల్పవే శ్రీకృష్ణా ౮

క॥ కార్చిచ్చు గవయుఁగానినుఁ
గూర్చి మొరలువెట్టు గోపకుల నందరి న
య్యార్చిచ్చు ద్దావముఁ జ
ల్లార్చి మనుపఁ గల్గినావ హా శ్రీకృష్ణా॥ ౮

క॥ మోహన మురళీగాన వి
మోహితులై ముదితలెల్ల మురియుచు నీవా
రోహముఁజేసిన యమునా
వాహిని దరిజేరువారు వడి శ్రీకృష్ణా॥ ౪౬

క॥ గోపికలు నగ్నలయి నది
లోపల నీరాడునంతఁ గోన నరిగి వ
స్త్రాపహరణ మొనరించితి
వో పద్మదళాక్షా! కొంటెవో శ్రీకృష్ణా॥ ౪౭

క॥ తనయాగము మాన్పించితి
వని సప్తాహములు వానఁ బట్టెఁ గురియ నిం
ద్రుని గర్వ మెడవ గోవ
ర్ధనగిరి నెత్తితివి నగధరా శ్రీకృష్ణా॥ ౪౮

క॥ ఓకపరిఁ గూటమిఁ జేయుచు
నొకతఁడవ నదృశ్యుఁడగుచు నొకపరిఁ గుచుఁ
సకలజన హృదయముల ని
న్నొకనే ధ్యానింపఁ జేతు వోగి శ్రీకృష్ణా॥ ౪౯

క॥ జలకేళి రాసకేళీ
విలసనముల గోపికాత్మ విహితుఁడవై వా
రలకెల్ల త్వత్స్వరూపా
కలనముఁ గూర్చితివి దృఢముగాఁ శ్రీకృష్ణా॥ ౫౦

క॥ నీభక్తుఁడైన నారదు
చే భూతంబులకు గలుగు చింతలెరిఁగి లో
భాభి హత శత్రులోకము
నీభువి వధియింపఁ దలఁపవే శ్రీకృష్ణా॥ ౫౧

కం॥ అక్రూరుఁడు బృందావన
మక్రూరతఁ జొచ్చి కంసునాజ్ఞఁ దెలిపి స
ద్విక్రమ! నిను బలదేవు స
వక్రతఁ గొంపోవ నరుగవా శ్రీకృష్ణా॥ ౫౨

కం॥ యమునా తోయములందున
సమవైభవమైన నీదు చరితము నక్రూ
ర మహాభాగున కెదఁ దె
ల్లముఁ జేసితివంట దయ జెలఁగ శ్రీకృష్ణా॥ ౫౩

కం॥ దుష్ట దనుజాంశులైన ని
కృష్టులలోఁ జేరుచాకి కిచ్చి స్మృతి శిరో
వేష్టనములు గొంటివంచటి
కష్టముఁ బాపుటకు మధురకడ శ్రీకృష్ణా॥ ౫౪

కం॥ వాయకు శోకంబు నీకై
బాయక దనుదానె కొన్ని వలువలొసఁగగా
నాయతి లక్ష్మీ యుతుఁగా
నాయత్తముఁ జేసితీవ హా శ్రీకృష్ణా॥ ౫౫

కం॥ మధురావీధి నడచు నో
మధురాధర లందరును సమగ్రంబుగ హృ
త్పథములఁ దాల్తురు నిను భ
క్తి ధనాంచిత లగుచు సమ్మతిని శ్రీకృష్ణా॥ ౫౬

కం॥ మాలికుడు సుదాముడు సుమ
మాలికలర్పించి భక్తిమార్గము నడుపన్
పాలనముఁ జేసితివి గో
పాలసతీలోల ధర్మపర శ్రీకృష్ణా॥ ౫౭

క॥ కంసాస్థానమున గజో
త్తంసముతో నున్న మల్ల దళములకు మద
ధ్వంసంబొనర్చ దేవో
త్తంసుఁడవై యరిగితివిగదా శ్రీకృష్ణా॥ ౫౮

క॥ గలుగల్లని కాళ్ళగజ్జెలు
బలుతెరగుల నాట్యమాడఁ గదిరి మ్రోగన్
లలితగతుల మదకుంజర
ము నిలఁగూలఁగఁ జేసితివిక దే? శ్రీకృష్ణా॥ ౫౯

క॥ చాణూర ముష్టికులు వ
ర్ణింపఁగరాని బలముఁగలవారైనన్
ప్రాణములు దీసితివి హాల
పాణియు నీవునుఁ గడంగి భళి శ్రీకృష్ణా॥ ౬౦

క॥ గరుడుఁడు సర్పము నొడిసిన
వరుసం గంసుని గ్రహించి వధియింపఁగ నా
సురమతులు నతని తమ్ముల
నరువఁగ నందరిని దునిమె హాలి శ్రీకృష్ణా॥ ౬౧

క॥ దుష్టవధానంతర మిక
కష్టంబులు దొలఁగెనని సుఖప్రేక్షకులౌ
శిష్టులగు నారదాదు ల
భీష్టప్రదు నిను నుతింప రే? శ్రీకృష్ణా॥ ౬౨

క॥ గిరిశాది దేవతలుభా
స్వరమగు నీతత్వమెరుఁగ జాలరనిన మే
దుర దోష దూషితుఁడు ని
న్నెరుఁగ గలఁడె? యెందు శ్రీహరీ శ్రీకృష్ణా ॥౬౩

క|| కామముచేతనో, మరియే
నేమముచేతనో, మఱెట్టి నేరుపుననో, నీ
నామము స్మరింపఁ బాప
స్తోమమునశియించు నందసుత! శ్రీకృష్ణా|| ౬౪

క|| కొందరు జారుఁడటంచును
గొందరుచోరుండటంచుఁ గొందరు లీలా
నందమగు తత్త్వమనుచు నె
దందలచి తరించుచుండెదరు శ్రీకృష్ణా|| ౬౫

కం|| నీమేన బావ మఱఁదులు
సామజ రథ తురఁగ రత్న సంతతులను నీ
కేమేమి లంచమిచ్చిరి
స్వామీ యటుమమ్ముఁ గావవా శ్రీకృష్ణా|| ౬౬

క|| ఓకరుణామయ! కృష్ణా!
నీకుఁ మ్రొక్కుదురు నటన్న నెఱున వస్త్రౌ
నీకముఁ ద్రౌపది కిచ్చితి
వాకమల సఖేందు నేత్రయుగ శ్రీకృష్ణా|| ౬౭

క|| శబరీదత్త ఫలావళి
సొబగొనరంగ నారగించి సురలుబొగడ నా
యబలపయిఁ గృపావీక్షణ
ము బరపి బ్రోచితివి సత్యముగ శ్రీకృష్ణా|| ౬౮

క|| గుహునిని వనమధ్యంబున
మహిమావిష్ణునిగఁ జేసి మనిచితివి భవ
న్మహనీయ దానమహిమను
నహహా నెఱుఁగగలనె? హరి శ్రీకృష్ణా|| ౬౯

క॥ శత్రుసహోదరుఁ డనెడు న
మిత్రత్వము జూపి కాప్తమిత్రునిగ దయా
పాత్రునిగా సుగుణుండగు
పుత్రునిగాఁ బ్రోచితివవుఁ శ్రీకృష్ణా॥ ౨౦

క॥ పతిశాప హత నహల్యా
సతిని చరణ రజముచేత సతి నొనరిచి స
న్నుతి సకలదేవ! పాపో
ద్ధతిఁబాయించితివి పరమదయ శ్రీకృష్ణా॥ ౨౧

క॥ కుయ్యో! కరుణామయ! రా
వయ్యా! యని గజము వేడ నాశుగతిని నీ
యొయ్యారంబున విడచియు
నయ్యెడ రక్షింప నేగితౌ శ్రీకృష్ణా॥ ౨౨

క॥ జనకుని బాధలఁబడి వం
చనలే కీసుమంతి నీవె శరణంబనిన నా
దనుజసుతుఁ గాచితివి త
జ్జనకుని హరియించి కీర్తిగన శ్రీకృష్ణా॥ ౨౩

క॥ మురళీగాన సుధారస
మరవింద భవామరాళి కతి దుర్లభమా
మురళీగాన సుధాఝరి
బరపితివి ధరిత్రి నఖిల పతి శ్రీకృష్ణా॥ ౨౪

క॥ ఖాండవమేర్చ నవుడు నా
ఖండల సూతికిని దోడుగా జనివిజితా
ఖండలుఁ జేసితి వతని న
ఖండానందాబ్ధిఁ మగ్నుగా శ్రీకృష్ణా॥ ౨౫

క॥ ధర్మజు రాజసూయాధ్వర
మర్మిలి జేయింప మగధు ననిలతనయు బా
హార్మికిఁ బలియిచ్చి మహా
ధర్మము రక్షించితివిగదా! శ్రీకృష్ణా॥ ౨౬

క॥ శిశుపాల దంతవక్త్రులుఁ
బశువులవలె నిండు సభా భవనమునఁ దట్టన్
విశసనముఁ జేసి నీలో
వసియింపఁగ జేసితీవు వడి శ్రీకృష్ణా॥ ౨౭

క॥ ఎన్నో వేళలఁ గడువా
పన్నులయిన భక్తజనులఁ బాయక వెన్వెం
టన్నిలిచి బ్రోచుచుండుదు
వన్నా! బహువేషధారివై శ్రీకృష్ణా॥ ౨౮

క॥ భక్తులఁ బ్రోచుటకై యను
రక్తిం దౌత్యంబునైనఁ గ్రహియించెద వా
సక్తులగు పాండుసుతులకు
యుక్తిగ దౌత్యంబు సల్పితో శ్రీకృష్ణా॥ ౨౯

క॥ సంతతము భక్తప్రతిన ని
తాంతము గాపాడఁగల వెదందలఁచి శుభ
స్వాంతుఁడు భీష్ముఁడు పల్కిన
దంతయుఁ జేసితివిగాదొ? హరి శ్రీకృష్ణా॥ ౩౦

క॥ మునివాల్మీక్యాది మహా
ముని వృషభులు జేయుకార్యము లన్నిటి నీ
వు నిజంబు నొనర్చితివో
యనఘా! సత్యానుశీలివై శ్రీకృష్ణా॥ ౩౧

క॥ అర్జునుఁడు సైంధవుని శిర
మూర్జితముగ ద్రుంచు ప్రజ్ఞనూనినఁ గరుణన్
నిర్జరులు పొగడఁగా నా
యర్జును గెలిపింపఁ జేసితౌ శ్రీకృష్ణా॥ ౮౨

క॥ భూకాంతు డంబరీషుం
డేకాంత సుభక్తి శ్రీరమేశుఁడవగు నిం
గైకొని భజింపఁగా సు
శ్లోకు నొనర్చితివి నిచ్చలున్ శ్రీకృష్ణా॥ ౮౩

క॥ ఎందరుభక్తు లెటుల హృ
న్మందిరముల నిన్ను గనుగొనం దలతురో నీ
వందరి కన్ని విధంబుల
నందంబుగ గానిపింతు హరి శ్రీకృష్ణా॥ ౮౪

క॥ భారత యుద్ధస్థానముః
బాఱఁగని క్రీడి మోహపరవశుఁడగుటన్
కారుణ్యంబున దెల్పితి
వారసి గీతలను దుష్టహర శ్రీకృష్ణా॥ ౮౫

క॥ గీతారహస్య మెఱుఁగ మ
హాతత్త్వజ్ఞులకె గాక యజ్ఞులకెట్టుల్
చాతురి గల్గఁగలదు? జీ
మూత తతులిత దేహ మత్ప్రభూ శ్రీకృష్ణా॥ ౮౬

క॥ ఈనుహిఁదత్త్వము దెల్పెడు
నేమతముల వారికైన నెంతయు గీతా
స్తోమమె ప్రమాణము ముకుం
దా! మాధవ! నందనందనా! శ్రీకృష్ణా॥ ౮౭

క॥ కాలయుగ భేదములు జగ
మేలికవా నీకులేవహీనతయా! యే
కాలము సర్వగతుఁడవై
శ్రీలంగూర్చెదవుఁ గరుణచే శ్రీకృష్ణా॥ ౫౮

క॥ మతతాంత్యమెఱుఁగని
మతిహీనులఁ బాగుఁజేయు మదిఁదలచి సుధీ
తతినుతియింపఁగ భైష్మీ
పతివై పాడమితివి విశ్వపతి శ్రీకృష్ణా॥ ౫౯

క॥ ఎన్నోసాధనములను మ
హోన్నతిగా జేతనులకు నొసఁగితివై నన్
క్రిన్నన నిన్నెఱుఁగు నుపా
యోన్నతిఁ దెలియంగలేర హో శ్రీకృష్ణా॥ ౬౦

క॥ నేనొకమానిసినౌనన్
శ్రీనాథా! పెక్కుగ్రంథచింతనఁ జేయం
గానేరక నీతత్త్వముఁ
గానఁగలేనైతిఁ బ్రోవఁగదె శ్రీకృష్ణా॥ ౬౧

క॥ నాకేల యితరచింతలు
నాకాధిపవినుత! శ్రితజనమ్ములఁ బ్రోవం
జేకొంటివి బిరుదము న
వ్యాకుల కారుణ్యమూర్తివై శ్రీకృష్ణా॥ ౬౨

క॥ ధరగల భాగవతోత్తము
చరణాబ్జంబులకుఁ బ్రణతిసలుపుచు లక్ష్మీ
వర! నీదయకొఱకే యీ
కరణి నిరీక్షింతు నీవెగతి శ్రీకృష్ణా॥ ౬౩

క॥ చిలుకను శ్రీరామయనుచు
బలికించిన వేశ్య పరమపదముఁగనియె నిఁకఁ
బిలచితి శ్రీరామాయని
వలనుగ నన్నట్లుఁ గావవా? శ్రీకృష్ణా॥ ౯౪

క॥ రామా కృష్ణా! యనుచును
నేమానవుఁడైనఁగాని యించుకయిన నీ
నామముబల్కినయెడ నీ
వేమెదు పాపములఁబాపియుంట శ్రీకృష్ణా॥ ౯౫

క॥ హలకులిశాంకుశచిహ్నము
లలరెడు నీపాదయుగ్మ మమలినమతినై
తులసీచంపక పుష్పా
దులచేఁ బూజింతు భక్తితో శ్రీకృష్ణా॥ ౯౬

క॥ పరమేశ్వర! కరుణారస
భరణా! వాణీశముఖ్య పాలననిపుణా!
సురముని సన్నుత సుందర
చరణా! నినుఁగొల్తు నఘముఁజన శ్రీకృష్ణా॥ ౯౭

క॥ కాలముఁ గడపుటకై నీ
లీల లభినుతించు శక్తి లేకుండిన నీ
లీలను వ్రాసితి త్రిజగ
త్పాలక! ననుబ్రోవుమయ్య దయ శ్రీకృష్ణా॥ ౯౮

క॥ మరువకుము నీదుభక్తుఁడు
నరహరి గోపాలదాస నాముఁడు పాపం
బరుగగ శతకమును భవ
చ్చరణముల కొసంగెఁ బ్రోవఁజను శ్రీకృష్ణా॥ ౯౯

క॥ కలియుగ గతసంవత్సర
ము లైదువేలంత మీఁద ముప్పదిమూఁడుం
గల వత్సరమున వ్రాసితి
నలఘుమతీ! దీనిగొను మనఘ! శ్రీకృష్ణా॥ ౧౦౦

క॥ మంగళము రుక్మిణీవర!
మంగళ మఖిలాంతరాత్మ! మంగళము హరీ!
మంగళము దానవాంతక
మంగళమిదె రాధికారమణ! శ్రీకృష్ణా॥ ౧౦౧

మంగళంమహత్

శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఓం తత్సత్,

శ్రీరాధాకృష్ణ చరణారవిందార్పణమస్తు.

